సఁగ। వారిమోముల కెనరామిఁబట్టి నెలను । దిగఁదుడుపు పెట్టుకై పడి మొగములకును।
జెలికిఁ జెలువునకుఁ జిరంటులలరువేడ్కఁ। గప్పురపుటారతులనిచ్చి రొప్పమీఱ॥ ౧౦౧
గీ॥ మొదటినాటితంతు ముగిసినపిమ్మటఁ। బాకెనయును నాగవల్లిమఱియు। వేఱ జరగ
వలయు వేడుకలెల్లను । వరుసజరిగె నెల్లవారు చెలఁగ॥ ౧౦౨॥ గీ॥ నాగవల్లియు
లోనుగా నడచినంతఁ। బెండ్లినాడులు గడువంగఁ జేర్మితోడ। నాలుమగలను గలుపంగ
నపుడుతలఁచి। మేటివేడుక నాలవనాటిరేయి॥ ౧౦౩॥ సీ॥ కమ్మతావులుగ్రమ్ము కపు
రంపువిడెములు పసిఁడిపళ్ళెరములఁ బొసఁగనుంచి। కస్తురి జవ్వాజి గంధంబుఁ బన్నీరు
రతనంపుగిండుల రమణనించి। పటికంపుగోడల పజ్జనిర్వంకల నిలువుటద్దంబులు నెలవు
కొలిపి। పగడంపుచనుగోళ్ళ పచ్చలపీటపై వట్టివేళ్ళసురటి పెట్టియుంచి । వెండితబు
కులఁబంగ్లువేశ్వెరపెట్టి। గొప్పరతనంపుదివ్వెలు కుదురుపఱచి। మేలిచొక్కపు బంగా
రుమేడలోని। వింతగదిని సింగారించి రింతులంత॥ ౧౦౪॥ గీ॥ పడకగదిలోని రతనంపుఁ
బసిఁడికోళ్ళ। దోమతెర పట్టెమంచంబు పైమెఱుంగు।టంచ దూదిపాన్పునఁ బవ్వళించి
యుండె। నతివరాకను మదిఁగోరియల్లుఁడు॥ ౧౦౫॥ వ॥ అంతకుమున్న॥ ౧౦౬॥
చ॥ కలపమలంది నెన్నొసటఁ గస్తురిబొట్టమరించి చేరలన్। గొలువఁగఁజాలు కన్నుఁ
గవకుం దగఁగాటుకవెట్టి క్రొవ్విదన్। వలపులుగ్రమ్ము పూసరులు వాఁవిరిఁజుట్టి పసిం
డిపుట్టముల్। జెలువుగఁగట్టి చెల్వఁగయిచేసిరి సొమ్ములువెట్టి నెచ్చెలుల్॥ ౧౦౭॥
గీ॥ చెలులుకయిచేసి తరలింప సిగ్గుకతనఁ। బడఁతినెమ్మోమువంచి తానడువకున్న।
బుద్ధులనుజెప్పి మఱిమఱి బుజ్జగించి। పూవుబోడులు బలిమిమైఁ బాదిగిపట్టి॥ ౧౦౮॥
క॥ ననబోడి నొకటలాగుచుఁ। బెనిమిటికడఁజేర్పఁ దివురవింతగ నాజ।వ్వని తాఁబోక
పెనంగినఁ। గనుఁగొని యొకచెల్వయనియెఁ గన్నులనగుచున్॥ ౧౦౯॥ గీ॥ ఇచట
మాతోడఁ బెనఁగిన నెవ్వరిందుఁ। జూచిమెచ్చరు రాతండచూచిమెచ్చ।బులుపుతీరం
గఁ బడకింటిపొంతఁజేరి। వెనుకతీయక మగనితోఁ బెనఁగరాదె॥ ౧౧౦॥ క॥ అనుట
యు సిగ్గును జెలిపైఁ।గినుకయుఁ జిఱునవ్వునొకట గిరికొన నపుడ।న్ననబోడినట్టెవైచె
ను। గనుదోయిం గెంపుదోపఁ గైవిరిదండన్॥ ౧౧౧॥ గీ॥ చెలిమికత్తెలు రుంబకు
సిగ్గొకింత । వెనుకకునుద్రోయ మెల్లన వెలఁదినడిచి। పడకయిలుచేరుతఱి మొలబంటి
సిగ్గు।ముంచి జాలువాఱుచుఁ దలమున్కయయ్యె॥ ౧౧౨॥ క॥ మిక్కిలి సిగ్గునమునిఁ
గిన। యక్కలికిం దలిమంబుచేర్చి యాచెలువ ల్తా।మొక్కొక్క సాకుననడిచిన। నక్క
మ్మయు మోమువంచి యళుకుచు నిలిచెన్॥ ౧౧౩॥ గీ॥ అంతటను గ్రీడి ముద్దియ
నల్లఁజేరి । మేనుచెమరింపఁ గెంగేలుమెల్లపట్టి । ముగుద విరిపాన్పుపయికి రాఁదిగిచి
కొనుచు। వంచుకొనియున్న నెమ్మోము పయికినెత్తి॥ ౧౧౪॥ గీ॥ ఏలవెఱవంగ విరి
విల్తు నాలకునకు । నెంతపనికైన నేఁజాలి యిచటనుండ । నాదుప్రాపునఁ బెనగంగ
బాధయనుచుఁ । జెక్కుచెక్కునఁ దారిచిచెప్పఁజెవిని॥ ౧౧౫॥ గీ॥ ఏలవేయును

నప్పు డన్నెలతోని చేయి దామరకన్నియ చిన్నికౌను । తడవియును మీఁద మెఱుఁగు
గుత్తంపు గబ్బి గుబ్బలను ముట్టి మిన్నందె కొండఁ బాఁకె॥ ౧౧౬॥ ఉ॥ నెచ్చెలులేగినం
జనకనిల్చిన సిగ్గును తోనిపాలు కానిచ్చుట దోసమంచు నపుడే చనుగొండలలోన దాచి
వివ్వచ్చుని కేలటుం గదియవచ్చినఁ దానపెనంగి యేమి పై వచ్చునొయంచు దాచెఁ
బిదపం గను ఱెప్పలలోనఁ గూరిమిన్॥ ౧౧౭॥ ఉ॥ కవ్వడిచేయి పోకముడి గ్రక్కున
నావలఁ జేరఁ బాఱఁగా । జవ్వని యేమియున్నలుపఁజాలక బిగ్గన తానె చెల్వునిన్ । నె
వ్వడిఁ గౌఁగిలించుకొనె నేర్పున తోడను సంతసిల్లి యా । క్రొవ్విరిబోడి కెంపెదవి
గొబ్బున గంటిడియానెఁ దేనియల్॥ ౧౧౮॥ గీ॥ క్రీడియామీఁదటను గిలిగింతగొలిపి ।
చేతపట్టును విడిపించి సిగ్గుమాన్పి । యింతి మరునాలమునకును నియ్యఁగొలిపి । కడపె
నారేయియంతయు గడియవోలె॥ ౧౧౯॥ క॥ చెలువయుఁ జెలువుండును బూవి
లుతుని కయ్యముల నలసి వేడుకనుండన్ । బెలుచనఁ గొక్కొరొకోయని । వెలుపలఁ
దగఁగోళ్లుమూనె వేఁకువ తెలియన్॥ ౧౨౦॥ గీ॥ తడవు రేతోనితోడను దనరియుండి ।
వెడలఁబోయెడుతఱిని రేవెలఁదివిప్పు । కొప్పునందుండి దిగజాఱి కూలినట్టి । విరులబంతి
నాఁ దోఁతెంచె వేఁగుచుక్క॥ ౧౨౧॥ చ॥ పగలొనరించు సాటిదొరవచ్చి దెసల్ వెసఁ
గ్రమ్మునంచు నెవ్వగఁదన తేజుగోలుపడి పాఱెడు చుక్కలతోనిఁ జూచి లోఁ దిగులునఁ
దెల్విఁబాసెననఁ దెల్లపడెం గడుఱిక్కగుంపులున్ । సొంగసగు నింటిదివ్వెలును జుక్క
లతోడనె తెల్విఁగోల్పడెన్॥ ౧౨౨॥ గీ॥ జగముచుట్టంబు రాకకుఁ జాలనలరి । పుడమి
వేల్పులు దీవించునడుపులనఁగ । జెవులపండువు సేయుచుఁ జెలఁగఁజొచ్చెఁ । గరముఁ
బులుఁగులరొదలెల్ల కడలయందు॥ ౧౨౩॥ గీ॥ ఇరులవేటాడఁ దొలుదొర లేసేసినట్టి ।
చిచ్చరమ్మనఁ దూర్పునఁ జెలఁగెఁ గెంపు । మలలకలుగుల దూరెడు నెలుఁగుపట్లు । చీకటు
లు కొండబొఱియలు దూరఁబాఱె॥ ౧౨౪॥ గీ॥ తమ్మిచెలికాఁడు చీఁకట్లఁ దఱుము
వాఁడు । కలువగుంపులసూఁడు రేవెలుఁగుజోడు । గాములకు నెకిమీఁడు జక్కవల
తోడు । పొడుపుకొండను జూపట్టెఁ బ్రొద్దుపిదప॥ ౧౨౫॥ గీ॥ అంతకంతకు వింత
యొయ్యారమమర । సరసములులేని వలపుల ననఁగి పెనఁగి । చెల్వుఁడును జెల్వయును
గూర్మి చెన్నుమీఱ । హాయిగానుండిరచ్చోట నాఱునెలలు॥ ౧౨౬॥ క॥ ఈలోపల నా
తొయ్యలి । చూలాలయ్యెను మగండుఁ జుట్టములు నెదన్ । హాళింబొందగఁ దండ్రియుఁ ।
జాలఁగొలఁపునిల్చునంచు సంతసపడఁగన్॥ ౧౨౭॥ క॥ చనుమొనలు నల్లపడియెను ।
జనఁజనఁ బేవిళ్లు హెచ్చెఁ జవిపుంటిపయిన్ । గనసయ్యె నెలలునిండినఁ । గనియెను ముద్దుల
కొమారుఁ గన్నియయొలమిన్॥ ౧౨౮॥ గీ॥ పుడమివేల్పులిడిన మంచిముహూర్తమందు ।
బభ్రువాహనుండనుచును బాగుమీఱఁ । బేరుపెట్టిరి యాపనిబిడ్డ కెలమిఁ । బెరుగుచుండె
నతఁడు తాతయింట వుకందె॥ ౧౨౯॥ క॥ అని వైశంపాయనుఁడిటు । జనమేజయుమన
కుఁ గరంబు సంతసమొదలన్ । నెనయఁగఁ జిత్రాంగదకత । వినిపించిన వినియతండు

# SPECIMEN VERSES OF PURE TELUGU UTTARA RAMAYANA
## BY THE AUTHOR.

## శుద్ధాంధ్రోత్తర రామాయణము.

(ప్రథమాశ్వాసములోని పద్యములు.)

తే॥ గీ॥ రక్కసుల నేని తలలెల్లఁ జక్కుచేసి। పుడమికూఁతును గైకొని వెడలి యట్లు। గాలికొమరుండు లోనుగాఁ గలుగువారుఁ। దమ్ముఁడునుఁ దోడఁజనుదేర నెమ్మిమీఱ॥ ౧॥ చ॥ అరదము నెక్కి యక్కరణి నందఱుఁ గ్రందుగ వెంటనంటఁగా। సరగున నందినాఁ బరగు చల్లని పల్లియఁ జేరు వారిలో। భరతుఁడు ముందుగా నెదురువచ్చి యడంకువఁ గాళ్ళఁ బ్రాలి తా। నరుదుగ వెంటఁ బెట్టుకొని యన్నను బల్లియ కిచ్చఁ దెచ్చినన్॥ ౨॥ సీ॥ నారచీరలు విప్పి నాడెంపు వలిపెంపుఁ బట్టుపుట్టంబులు బిట్టు కట్టి। యడవిక్రొవ్విరులూడ్చి యందంపుఁ జెందమ్మి లరుదుగాఁ దుఱిమిన సరులు దాల్చి। వెడవెడ ముడివడ్డ జడలు సిక్కులు వాపి సిరిమీరు నునుజారు సిగలమర్చి। మొఱమట్టి నిడుపట్టె లెడలించి నుదురులఁ బదనుకస్తురిబొట్లు కుదురుపఱిచి। మేలిరతనంపు రవణముల్ గీలుకొల్పి। తారు కైసేసికొని యెల్లవారుఁ బొగడఁ। దమ్ములిల్లాలు బంటులుఁ దానుఁ దఱలి। యొప్పు మీఱంగ రాముఁ డయోధ్య కరిగె॥ ౩॥ ఉ॥ అంతకుమున్న వారలటు లచ్చటకుం జనుదెంచుచున్నలా। గంతయు వేగ వేగుల యాగక బాగుగ విన్నవించినన్। సంతసమంది ప్రగ్గడలు సందడిసేయుచు నూరివారలన్। గంతునఁ బిల్వనంపి సరగంజని ప్రోల్గయిసేయఁ బంచినన్॥ ౪॥ సీ॥ కమ్మకస్తురినీటఁ గలయంపి చల్లించి జిగితేటపన్నీట జగతులలికి। యాణిముత్యంబుల నమరించి ముగ్గులు పందిళ్ళ కురువేళ్ళఁ బొందుపరచి। జాళువాపని మేలిమేలుకట్లలరించి పచ్చలదోరణాల్ బలియఁజేసి। పసిఁడికంబముల నబ్రంపుటంటాలు నిల్పి కప్రంపుఁ బొగలెల్ల కడలనించి। వీడు కైసేసి తాముసు వేలకొలఁది। పలువసొమ్ములు దాలిచి చలువవలువ। లందమును గట్టి యుండఁ బ్రోలందమొంది। కరము కన్నులపండువు గాఁగనుండె॥ ౫॥ వ॥ అంత॥ మ॥ పదియాఱ్వన్నె కడానిమేడలపయిం బాలిండ్లవాంగాడ నెమ్మదిలోఁ గోరికలూరఁ గ్రొమ్ముదులు పైపైజార లేజవ్వనుల్। కదియన్వచ్చుచునున్న రాకొమరు వంకంజూడ లోఁ బొమ్మయుం। జెదరంబారఁగ మీఁదఁజల్లి రలరుల్ చేనిండఁ గీలింపుచున్॥ ౬॥ తే॥ గీ॥ వేల్పులాతండు తమదాయ బింకముడఁప। వేల్పు ప్రాఁకుల నెత్తావి విరులుగోసి। యలరివయిఁ జల్లు పెల్లున నలరువాన। లెఱచలందంద గురియుంపఁ దెరువుఁదాఁటె॥ ౭॥ సీ॥ తామెల్లనూచిన నోములు పండె నేఁటికటంచు నీటివారొకటనుబ్బ। నెన్నినాళ్ళకు నిన్ను నిటుఁగంటిరా కన్నతండ్రీయని యనుంగుతల్లిండలర। నేలు మెల్లపుడు నీ నేల నీవేయని వెసదీవనలు నేలవేల్పులొసఁగఁ। బుత్తడిపళ్ళెరంబులుపూని ముత్తైదువలు

పాటపాడి నివ్వాళులియ్య। నెల్లుచో త్రెంచి తల్లులకెల్ల మ్రొక్కి। తమ్ముగలవారినందఱం
దగినయట్లు । గౌరవముచేసి యతం డెల్లవారు మేలు । మేలని పొగడంగా నేలయేలు
చుండె॥ ౮॥ వ॥ ఒక్కనాండు॥ మ॥ ఒకచోట న్మరకతాలడాలడరి యెంతోయెండం
గాయంగ వే।ఱొకచో ముత్యపునిగ్గువెన్నెలల చెల్వానంగ నామీద నుం।డొకచోం
గెంపులచాయ తిన్నియలువేయున్ సంజకెంజాయ పో।లికగా నొక్కెడం గప్ప
ఱాగమి యిరుల్వింపంగ నాకొల్వునన్॥ ౯॥ సీ॥ చెలువంబుగానాడు వెలయాంధ్ర
బంగారు చిఱుగజ్జియల మ్రోత చెవులు దవుప । విరిబోండులిపు క్రేవ వింజామరలువేయ
వెడలు చల్లని గాలి విందు గొలుప । రహిమీఱం దాల్చిన రతనంపు పనిసొంపు తొడవుల
తళతళల్ కడలు నిండం । బగడాలకంబాల వజ్జముద్దినుసుల కెంబట్టు పఱపులు డంబు
చూపం । గొలువనేతెంచు దొరలెల్ల గుములుగూడి । యనమొనపుదాక నందంద
యొదిగియుండె । యనుగుదోయికి మ్రొక్కుచు నవల నిలువం । బసిండిగద్దియం గొలు
వుండె బలియుడతండు॥ ౧౦॥ ఉ॥ అప్పుడు కుప్పతిప్పలుగ నాతనిం జూతమటంచు
నెంచి వే। యొప్పులకుప్పలౌ తపసులుక్కున నక్కడకేగుదెంచినం। దప్పక చూచి లేచి
తనదండను నజ్జడదారిపిండుకుం । జొప్పడు పెద్దగద్దియలు చుట్టును బెట్టంగంబంచి
వేడుకన్॥ ౧౧॥ తే॥ గీ॥ ఎదురుగానేగి తోడ్తెచ్చి యెల్లవారిం । దగినచోటులం గూ
ర్చుండం దగవు సలిపి। రెండుచేతులు జోడించి నిండుమదిని। నెంతయుం బాగ డ్తలూన
రించి యిట్టులనియె॥ ౧౨॥ క॥ నేమమె మీకున్ మీకడ। గోమునంగల చదువులెల్లం
గొను వడుగులకున్। నేమమె మొకములరాయిడి । మీమీనెలవులను లేక మేలౌదవె
డునే॥ ౧౩॥ క॥ ఎవ్వరు మీకుందొందర। లెవ్వరుగా మంచినీటి యెద్దడి యెపుడున్।
రవ్వంతయు లేదుగదా। పువ్వులుకలవేగద సతముచు గోనలలోన్॥ ౧౪॥ తే॥ గీ॥ తెరు
వు గనలేక దొసంగులం దేలుమాకు । దారిచూపెడు తలంపునం దపసులార । తలవని
తలంపుగా వచ్చి పొలుచు కతనం । గంటిమిమ్ముందఱం గనుల కఱవు దీర॥ ౧౫॥ ఆ॥ వె॥
అనినం దేనెమాట లౌనని మెచ్చుచు। నొండొరుల మొగంబు లాఱంగి చూచి । యొక్క
మాటగాంగ నున్నవారందఱు। దిట్టతనము మీఱ నిట్టులనిరి॥ ౧౬॥ ఆ॥ గీ॥ అడుగవలసి
యడిగి తంతియకాక నీ। వెఱుంగనిదియుంగలదె యెందు నెపుడు। నైన నిప్పుడదియె మా
నోటంబలికింప। వేడుకయ్యె నేని వినుము తెలియ॥ ౧౭॥ క॥ మీకడకంట నెచూచినం।
గా కలుగున్ నేమ మిజ్జగములనన ముఖ్యుం। జేకొని ప్రోచుచు వింతగ । మాకయ్యది
యడుగనేల మఱిమఱి చెపుమా॥ ౧౮॥ క॥ జగములకెల్లం దొందర । యగు రావణుం
డీల్గెంగాదె యనిలో నీచే। నిగనెవ్వరిచేం దొందరలగుం దగ మాకింట్లకెల్ల నప్పటి
కరణిన్॥ ౧౯॥ సీ॥ ఎప్పుడుంగంటిపై ఱెప్పవాల్చుటలేని జేజేలకిపుడుగా చేటువచ్చె।
నయిన వారిని బాసి యడవులంగూర్పెట్టు తపసులకిపుడుగా తాల్మికలిగె। బిచ్చకానిచెలి
మి యచ్చుపడ్డట్టి జక్కులదొరకిపుడుగా కలిమికలిగె । గాలి బ్రతుకుం జెంది కలుగులం

బడియుండు చిలువలకిపుడుగా తెలివిగలిగె । లేచియొకచోట నిలుకడలేకతిరుగు । చలువతెమ్మెరకిపుడుగా బలిమిగలిగె । నిపుడునీపేరుచెప్పక నిలువఁగలిగె । జగములకు నెల్ల రక్కసుచావుకతన ॥ ౨౦ ॥ ఉ ॥ ఎందఱివానిచుట్టముల నెందఱిసంగడికాండ్రఁ బోరిలో । జిందరవందరల్పరపి చెండితివించుక నేపులోన వా।రందఱు నొక్కఁగాఁదరమె యీ నలుమోముల వేల్పుకైన నీ । వందఱమించి తెవ్వరికనౌదురు నీసరి ముజ్జగంబులన్ ॥ ౨౧ ॥ శా ॥ అవ్వారందఱు నొక్కయెత్తుసరిగా నాయింద్రజిత్తొక్కఁడుం । జివ్వన్వేఱొకయెత్తుచూడ నతనిం జెండాడె నీతమ్ముఁడిం । కెవ్వాఁడట్టుగనోపు నమ్మగతనం బెండ్లైన మున్నంటిమే । నవ్వుల్గావుసుమయ్య మావలుకులన్నెమ్మదిన్నమ్ముమా ॥ ౨౨ ॥ వ ॥ అనిన రాకామరుం డిట్లనియె ॥ ౨౩ ॥ చ ॥ ఎటువలెనింద్రజిత్తునకు నింతగ నెక్కుడుబల్మికల్గెఁ దా । నెటువలె వేల్పుతేజినని నెక్కటినోరిచెఁ దండ్రికంటె మి।క్కుటముగ బీరమెట్లొదవెఁ గూరిమిమీఱఁగ నానతీయరే । తటుకున వానిపుట్టువయుఁ దండ్రికొలంబు తెఱంగుకంగుగన్ ॥ ౨౪ ॥ తే ॥ గీ ॥ మొదటినుండియు రావణుపుట్టుకయును । ముజ్జగంబులు నాతండు ప్రోడయగుచు । గెల్చిన తెఱంగుఁ దొలివేల్పుగొల్చివలయు । మెప్పులొందిన యొప్పును జెప్పవలయు ॥ ౨౫ ॥ ఆ ॥ గీ ॥ అనినఁ గొలువువారి యానతిఁగైకొని । కడఁగివారిలో నగస్త్యుఁడంత । చెలువుగులుకుకలికి పలుకులు చెవులకుఁ । జవులుపలుమరువెదచల్లఁబలికె ॥ ౨౬ ॥ సీ ॥ వినవయ్యజడదారి వెలయుఁబులస్త్యుండు మొదటివేలుపునకు ముద్దుపట్టి । మచ్చరంబును గెల్చి మరునకులోఁగాక యీసనుదిగనాడి యేలరువాఁడు । నిక్కంబుతప్పక యెక్కుడుతెలివిని నీరసంబెఱుఁగక యెసఁగువాఁడు । తొలివేల్పు చుక్కంటి వలచురిదాల్పుల నిచ్చలుమదిలోన నిల్పువాఁడు । వల్లమాలినపూన్కితోనిల్లువెడలి । చలువగాలిపెడు వలిమలకెలననలరు । చెలువుగులికెడు తృణబిందునెలవుచేరి । తపనితనమూని యున్నంతఁదారసిల్లి ॥ ౨౭ ॥ చ ॥ అలరులకొమ్మలో మరునియమ్ములొ బంగరుకీలుబొమ్మలో । వలపులదీపులో తొలవలబావులో చక్కని గుజ్జుమావులో । తొలకరిమించులోయనఁగఁ దూకొని యచ్చరలేమలచ్చటన్ । గెళుకుకనుంగవల్ తళుకుబెద్దొడలుం దగసందడింపుచున్ ॥ ౨౮ ॥ సీ ॥ ఒకచోట మఃపాట లొకతేటగాఁబాడుదురు నల్లజాతెల్లఁ గరగిపార । నొకయోరవగమీర మొకమోరగనొనర్తు రలమిదట్టంపు వెన్నెలలుగాయ । నొకచాయఁ గనుకాయలకు దాయవత్తు రొయ్యారంపునడకల హావునిండ । నొకదండవిరిమండలాడినిండఁ గూర్తురు కమ్మనితావులు గ్రమ్ముకొనఁగ । బిలుతురొకచక్కి నెచ్చెలిపిండునిక్కి । కలికిపలుకుల చిలుకలు కలఁగిచూడ । నసుతురొకక్రేవ సొలపుగా నడిమిత్రోవఁ । గదియనరుదెంచి యంచలు కాళ్ళఁబెనఁగ ॥ ౨౯ ॥ తే ॥ గీ ॥ బటువుబిగిగుబ్బలరదోఁపఁ బైటజార । మదికలంగఁగఁ గందువమాటలాడఁ । జూడ్కిమిఱుమిట్లుగొనఁ జెంతఁ జేరవలెఁగఁ । గలయఁదిలకించి జడదారికళవళించి ॥ ౩౦ ॥ చ ॥ అటునిటుమ్రోలవేల్పు జవరాండ్రు మొ

లంగుట నెంచిచూడఁగా। నేటులునుదానునైకొనిన యిప్పటిపూన్కికే నడ్డువాటుగాఁ।
దటుకున నల్లమందెఱిఁగి తాళఁగఁజాలక వారినందఱిన్ । దిటముఁనఁజేరఁజీరి వెను
తియ్యని తియ్యనితేటమాటలన్ ॥ ౩౧॥ శా॥ ఏలావేయను గొమ్మలారవినుఁడీ యీ
మీాదనీతోటలో। వాలారుంగనుదోయివిచ్చి మరియేవాల్గంటి నంజూచునో। యాలే
జవ్వని యెప్పుడేయిచటఁ జూలాలౌనటఁచాడినం । జాలుంజాలునటంచు నాటవల
పుల్ సాలించివారందఱున్॥ ౩౨॥ క॥ వచ్చినదారినెపదరే । యిచ్చటఁ దలలెత్తి
చూడ కెచ్చటికైనన్ । మెచ్చఁగవలదాత్రోవనె । వచ్చినపనియయ్యెనంచుఁ బకపక
నగుచున్॥ ౩౩॥ క॥ ఇంతటితోసరిపెట్టను। గొంతతలలు తడవిచూచుకొంటిమి బళి
రే। గొంతటినోములునోచితి । మింతిరొ మనతొంటిమేననే యనిచనుచున్॥ ౩౪॥
చ॥ వడివడిఁబారుతెంచి యొకపైదలి యూర్పులువుచ్చి నవ్వినం। బడఁతుకయొర్తుచా
లిపుడె నవ్వకుమంతయు ఁటపెగట్టిగాఁ । గొడుకులతల్లి వౌదువాక కొంచెమునాఁటికె
దాచుకొమ్ము నానుడికెనెలంతయుం గడుపులుబ్బఁగనవ్విరి కొమ్మలందఱున్॥ ౩౫॥
క॥ ఒక్కతె చనుమొనకస్తురి। నిక్కఁకనఁగవచ్చు చెలికి నిలుమనిమ్రొక్కన్ । విక్క
చుఁగొమరునగనుమని । చక్కనదీవించె వీపుచరచుచుదానిన్॥ ౩౬॥ తే॥ గీ॥ ఇట్లు
మేలంబులాడుచు నింతులెల్ల। నెడగలుగఁబోయిరంతట నిచటఁ బూలు।గోయుఁ దృణ
బిందుగారావుఁ గూతరసుఁగు । చెలియతోఁగూడి పూదోఁట మెలఁగుచుండి॥ ౩౭॥
క॥ మునుపటు బెట్టిదముగ నా।యనవాక్రుచ్చుటలు విన్నయది గా దటుగా।పున వెఱ
వన్నదియెఱుఁగక। వెనుకయుముందుంతెలియక విచ్చలవిడిగన్॥ ౩౮॥ సీ॥ వేసవి సం
వంగి విరులనెత్తావికిఁ దెమ్మెరల్ దరిచేరఁ దేంట్లువారఁ । జక్కని నెమ్మోము జాబిల్లి
జిగికిని నెఱవాల్గురంగఁ గల్వలుచెలంగఁ । దనమేనిజవ్వాజి తావికిఁ బునుఁగుపిల్లులు
డాయ రాచిల్కలు లిలికిమాయ । నలువైనక్రొవ్విద నల్లమబ్బునకును నెగనియంచలు
వీడనెమ్ములాడ।విరులుద్రుంచుచుఁ దేనియల్ వెదకికొనుచుఁ। బంగ్లరాల్చుచుఁ గెందమ్మి
తూండ్లఁగొనుచుఁ। జానసింగారముల తోఁటలోనఁదోడి। చెలియనెడబాసి యొకకొం
తసేపుతిరిగె॥ ౩౯॥ క॥ బోటింగానక యావిరి।దోఁటం దిరిగితిరిగి యెటుదోఁచక
యొంటిన్। మాటికెలుఁగెత్తిచీరుచు । మేటితపనిఁగాంచె నొక్కమొలపున నెదురన్॥
౪౦॥ ఉ॥ చెక్కులుతెల్లవారెఁ గముచిన్నెయొయారవుఁ గొనుమీారెఁ జన్నుకుక్కల
నల్పునేరె జిగిపూపనిగారవుఁ జన్నుదోయి వెం।పెక్కవతేరె దట్టమయి యొంతయు
నారలరారె నూరుపుల్। మిక్కిలియూరె నత్తపని మిన్నఁ గనుంగొని నంత నింతికిన్॥
౪౧॥ తే॥ గీ॥ అక్కరణిఁదాను జూలింతరాలితనము । పూనుటమఁజాల పదిలోనఁ
బొగిలిమగుడ । దానికిఁగతంబు పరికించికానలేక । యచటిమందుల నయ్యోఁగాకంచు
నెంచి॥ ౪౨॥ తే॥ గీ॥ ఇంకనేమందు నట్టివానింటఁబుట్టి । నేఁడు పేరుపెద్దతికంబు
నీటఁగలిపి। వట్టిరట్టులుపడ నొడికట్టుకొంటిఁ । గటకటా యిది నావంటికన్నెకగునె॥

౪౩॥ క॥ మిక్కిలికటికితనంబున। నక్కటికములేక సుదట నాకట్టెఁడి వే।ల్పిక్కరణి
మూఁడుబంతుల । నక్కట నావంటిదానికా వ్రాయుటతాన్॥ ౪౪॥ క॥ ఇదివిన్న
యమ్మలక్కలు । మెదలంగానిత్తురె యిఁకమీఁదట నన్నున్ । మదినేరమెంచుఁదండ్రి
యుఁ। బదుగురిలో వట్టిరవ్వ పాలైతిఁగదా॥ ౪౫॥ క॥ చెలులుం బుగ్గలువాడుతురు।
నలుగురిలో నవ్వుబాట్లు నాకనిఘటియుం । దెలివొందితండ్రికడకా । చెలువతుదకు
గుండెజాయీ చేసుక యరిగెన్॥ ౪౬॥ క॥ అటువంచినతలయెత్తక । బొటబొటఁ
కన్నీరుగార బొటప్రేల్నేలం। జిటుకున వ్రాయుచు మేనొ।క్కట గడగడవడఁకఁదండ్రి
కడ నిలుచున్నన్॥ ౪౭॥ తే॥ గీ॥ కొంతవడికిని దలయెత్తి కూఁతు నెదుటఁ । జిన్నవో
యినమోముతో నున్నదాని। నట్టితిలకించి యుల్లమిట్టట్టులూఁగ। డెందమున నింత సం
దియంబందివలికె॥ ౪౮॥ క॥ పువ్వుంబోఁడిరో యెవ్వని । కవ్వలనేయెగ్గొనర్చి తండజు
లోనన్। రవ్వగనూర్వంజాలక। యెవ్వఁడు నిన్నిట్టుతిట్టె నించుకలోనన్॥ ౪౯॥ కం॥
నాముందఱ నీకీ వెఱ।పేమీ ననుఁగన్నతల్లి యుప్పడిచట నీ।వేమియుఁ గొఱంతనా
చామా యిఁకఁదెల్పవమ్మ జరిగినదెల్లన్॥ ౫౦॥ ఆ॥ గీ॥ బ్రదికినంతతడవు పరువా
యె లేక। తల్లిదండ్రులెపుడుఁ దలలువంపఁ । బుట్టరాని యాఁడుపుట్టువుఁ బుట్టియ
గాని చేతకేల కడఁగితమ్మ॥ ౫౧॥ క॥ మునుపటితెలివెల్లను జా।వ్వనిరో యిపుడెందుఁ
బోయె వగచెదు నిన్నే।మన నెన్నటికిం దఱుఁగని । పెనురట్టడి మాకుఁ దెచ్చిపెట్టితివని
నన్॥ ౫౨॥ చ॥ వెలవెలవోయియచ్చెలువ వేమఱువెల్వడి జాలువారుకన్ । గలువల
వేఁడినీటఁ గనుకందినకాళ్ళకు నేదదీర్చుచుం। బలుకులవిన్నఁబాటొదవ మైచెమరింప
నెలుఁగురాల్పడం। బలికెఁ దమంతరాచిలుక బారులుచేరువఁబాఱుతేరఁగన్॥ ౫౩॥
శా॥ తండ్రీ కొండొకదోసమేనెఱుఁగఁజూ తప్పెన్నమీయాన పెక్కండ్రీత్రోవను
బూలుగోసికొని యేగంజూచి డెందంబులో। వేంద్రంబా తమి పెల్లిదంబడపకే విచ్చేసి
యాతోఁట నిల్లాంద్రందెల్లను వానిగన్నచెలితో శందందనేఁగ్రుమ్మరన్॥ ౫౪॥
తే॥ గీ॥ ఏకతంబునఁ జెరలాడనేకతంబొ।కాని,యటనాకుఁ జెలిచెంతలేనితఱిని। నిట్టి
చూలేర్పడియెఁగాని యింతకన్న। వేఱెఱుంగను మీయాన వేయునేల॥ ౫౫॥ తే॥ గీ॥
అనినలోపలిచూపున నరసినిజము। కన్నుఁగవ ప్రేమలఁగట్టిన కరణిఁదోపఁ । జానయెడఁ
దప్పులేమికి సంతసించి। కూఁతుఁగనిపల్కెఁ గూరిమి కొనలుసాగ॥ ౫౬॥ క॥ అమ్మా
యూరకనీపై । నిమ్మాడ్కిన్ లేనిపోని యీనేరము నేఁ । జిమ్ముట తప్పఁగఁబట్టక।
యుమ్మలికము మానియుండు ముల్లములోనన్॥ ౫౭॥ క॥ తనుఁగనుదానికిఁ గడు
పో।ననుచుఁ బులస్త్యుండువలికె నది యింతెఱుం।గనికతమున నీవాతనిఁ। గనుఁగొంటి
విగానఁ జూలుగలిగెన్నీకున్॥ ౫౮॥ క॥ ఇంతటిపనికేఁ గలుగఁగ । వంతలఁ దలకంగ
నేల వలవదు నీకా।వంతయుఁ గొఱంతలేదిఁకఁ। జెంతకురమ్మంచుఁ గూఁతుఁ జేరఁగఁ
బిలిచెన్॥ ౫౯॥ తే॥ గీ॥ పిలిచితొడమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని యు।తండు బుగ్గ

బుద్ధిడి నిండుతమిని । గొప్పదుప్పటముఁ బయిచీరకొంగుతీసి। కనులనీరొత్తి తడవుగఁ
గౌఁగిలించి॥ ౧౦॥ చ॥ చనువున లేవనెత్తి యెలజవ్వని కేలూఁతచేతఁబూని గొబ్బునఁ
దనవెంటఁబెట్టుకొని పోయి పులస్త్యునిఁ గాంచి మ్రొక్కి యా।యనకు వెలందిఁ జూపి
తగ నప్పటికట్టడి నింతి చూలుదాల్చినదగు పేర్పడంబలికి చేతులు రెండునుఁ జేర్చి
యిట్లనున్॥ ౧౧॥ తే॥ గీ॥ తపసిమైయున్న యుక్కొంటికపుడు కొలువు। గట్టి రాకన్నె
చేసిన కరణినిపుడు । తపసిమైయున్న మిమ్ము నీతలిరుబోడి । నమ్మికొలుచును బెండిలి
కమ్ము దీని॥ ౧౨॥ క॥ ఎండలబడలినయప్పుడు। మెండాకలి గొన్నయపుడు మీకొక
ప్రాపై।యుండి తనయండనిడుకొని । పండులొసంగు లతకూన బడలికలడఁగన్॥ ౧౩॥
తే॥ గీ॥ అనుచుఁ జేతిలోఁ జెయివెట్టి యప్పగించి । యతఁడు సైకొన్నపిమ్మట నల్లు
నొద్ద। సెలవుసైకొని కూఁతును నిలువఁబనిచి। లేచి తనయింటి కేగె నారాచతపసి॥ ౧౪॥
క॥ అదిమొదలుగ నాకన్నియ । వదిలముగా మగనికూర్మి వడయంగఁ దలం।పెదలోఁ
బాదలఁగ నాతని। మదిలోవల మెలఁగుచుండె మఱపెఱుఁగనిదై॥ ౧౫॥ సీ॥ ఎపుడుఁ
బ్రొద్దునలేచి యేటమునిఁగి యింటి కేతెంచునంతలో నెదుఱువచ్చి । యడుగు కెంద
మ్ములు కడిగికొనఁ బనిండిచెంబున నీరందిచెంతనునిచి। వరుగునఁ దననునుపైటచెఱంగు
న నడుగులుతడియొత్తి యంతలోన। నుతికిన తెల్లదోవతులు పింజెలువెట్టి చని చేతికం
దిచ్చి సరసనొక్క। పీటవెట్టికూర్చున్నచోఁ బెరటనున్న। పువ్వులొకపళ్ళెరంబునఁ బోసి
యొసఁగి। వార్చియాతండులోనికివచ్చునంత। పిండివంటలతోఁగూడ వండిపెట్టు॥ ౧౬॥
తే॥ గీ॥ ఆరగించెడుతఱినొకయోరనిలిచి। విసరుపీవనచేఁబూని వెనుకఁబూల।పానుపొ
క్కటి సవరించి పవ్వళింపఁ । దొడలపైనిడుకొని మెల్లనడుగులొత్తు॥ ౧౭॥ క॥ నడి
రేయిమైనఁ బిలువురు। బడిబడినడతెంచిరేని వారికిసరిగా । గుడువంగఁ బెట్టునప్పడు।
మడికట్టుకవంటచేసి మరియాదమెయిన్॥ ౧౮॥ తే॥ గీ॥ అదనుతప్పకుండఁగ నోరె
మమరుచుటకు। నింటితీర్పునఁ దనుమఱపించుటకును। దపసియాంతవాఁడును జాక్కెఁ
దలిరుబోండ్ల।యిచ్చకంబులఁబడనివారెవ్వరింక॥ ౧౯॥ వ॥ అట్లు॥ తే॥ గీ॥ కూర్మిమగఁడు
కన్నులఁగప్పకొనఁగ నుండి । యంతకంతకు వేవిళ్లువింతమీఱఁ । జాల కసిగాటులుగఁ
దిండి సలుపఁజొగె। నెలలునిండె నీళ్ళాటప్రొద్దులునుడాసె॥ ౨౦॥ క॥ మగుడ యొక
మంచినాటను। మగవానింగనియె మగఁడు మదినుప్పొంగన్। మగవానిఁగన్నతండ్రియు।
మగువంగన్నట్టితల్లి మక్కువపడరే॥ ౨౧॥ సీ॥ ఏతొందరయులేక యెలమితోఁ జుట్ట
ములెల్ల నిండువేడుకఁ జెందరెండుతలలు। కుదురుగా నేర్పడి పదినాడులును జన్న మరునాఁ
డు పురిటినీళ్ళలరిపోసె । యిరువదొక్కటవనాఁ డెదఁదలపోసి పెద్దలుపెట్టిన యొక
ముహూర్తంబునందుఁ। బరతెంచితపసియు విరిబోడియును బారసాలపీటలమీఁద సంతస
మునఁ। గూరుచుండఁదండ్రి కొమరునకప్పుడు । విశ్రవసుఁడనంగఁ బేరువెట్టి । నాఱవ
నెల నోరెమమరంగముట్టించి। వడుగు నేడులేడు గడువఁజేసె॥ ౨౨॥ చ॥ పితృుని

మాడ్కి విశ్రవుఁడు పిన్నటనుండియు మెండుదండియై। జతనము హెచ్చ మచ్చరముఁ
జంపి వడిం జడదారి దారిఁ దా। నతివలమానిపూని తనునందఱు నందరుదంది చూడఁగా।
సతమును గానలోన రెయి సైతము నీతము నిండ నుండఁగన్ ॥ ౨౩॥ క॥ పుడమి భర
ద్వాజుండను। జడధారియొకండు తనదు చక్కని బిడ్డన్ । వడి దేవవర్ణి యనియెడు।
పడఁతుకఁ దోడ్కొనివచ్చి పలికెం బెరిమన్ ॥ ౨౪॥ సీ॥ చెలువకన్నులడాలు చెంగల్వ
విరిచాలు నిను మడింపఁగఁజాలు నింపు నింపుఁ। గొమ్మ పొక్కిలి పెంపు కమ్మతావుల నింపు
పొన్నక్రొన్ననసొంపు పొలువుఁ దెలుపు। మగువ పన్నులతీరు మల్లెమొగ్గల పేరు లోనఁ
గూర్పఁగను గోరు నొఱపు నెఱపుఁ। జానచక్కని ముక్కు సంపగి పువు టెక్కు దాపునఁ
జెయిచిక్కు నేపుఁ జూపు। నువిదచేతులు పూదండలొసఁగుచుండు। నింతి నెమ్మోము
విరిదమ్మి నెలమిఁ గూర్చుఁ। బూజసల్పెడు తఱి యందు బూఁని మీకు। గట్టిగా నన బోఁడిఁ జేపట్టి
వలయు॥ ౨౫॥ మ॥ అన నెమ్మోమునఁ బిన్ననవ్వొలయ నొయ్యారంబుగా లేచి యా।
యనవెంటం గొని తల్లితండ్రులను డాయంబోయి కాన్పించి వచ్చిన కర్జంబు కరంబు య
వీనులలరం జెల్వంబుగా విన్నపం। బొనరింపన్మది నుబ్బి మైకొనిరి వారొండాడఁగా ఽన్॥
తులే॥ ౨౬॥ ఉ॥ అంత నొకింత మంతనము నందుఁ గొమారుతలంపెఱింగి వా।రెం దర
యు పంతసంబడర నింతిఁ గొనం దమడెందమందు నొ।క్కింతయు నడ్డులేమి యెన్నలవి
గించిన మేలని వారుఁదారున్ । వింతగ వియ్యమొందఁగను విందుగ నందఱు నంది దను
బొందుగన్ ॥ ౨౭॥ సీ॥ తమ్ములమ్ములనంది తరువాత నిరువురు బట్టలొండొరులకుఁ గట్ట బొ
జెట్టి। పెండ్లి పనులు చేసి పెద్దల రావించి తమవారితోఁ గూడి తరలి వెళ్లి। వియ్యపువారిద్దఱం
విడిదెలో పలదిగి నాల్గునాడులతంతు నడపిమఱియు। నలుకపానుపు మొదలైన వేడుకగ
లెల్ల జరుగవలసినట్లు జరుగనలరి। నాగవల్లి యైన నాఁటిరేయూరేగి। యొప్పగింతలైన
యప్పుడగవు।తగవు లరణములును దగినయట్టులొసంగి। పెండ్లికూఁతువారు బిడ్డ
నిచ్చి॥ ౨౮॥ తే॥గీ॥ అంపకము సేయఁ బైనమై యపుడకదలి। పెండ్లికూఁతుతోఁ గూ
డ నా పెండ్లికొమరు। నొక్కపాలకి నెక్కించి యుబ్బుమీఱ। నింటికే తెంచెను బులస్త్యుఁ
డింపుమెఱసి॥ ౨౯॥ క॥ పిల్లది పెద్దది యైనం। దల్లియుఁ దండ్రియును వచ్చి తమముచ్చ
ట పెం।పెల్లను దీరఁగఁ గొమరెకుఁ। గొల్లగ సొమ్ములిడి కోర్కె కొనసాగంగన్ ॥ ౩౦॥
క॥ పెనిమిటి పెండ్లాముల మం।తనమున నొకటిగ నొనర్చి తలిదండ్రులు వే।డ్కను దమ
యింటికిఁ బోయిన। వెనుకం జాలేరువడియె వెంఁదికిని చటన్ ॥ ౩౧॥ క॥ అన్నన బోఁడి
కడుపునం। బున్నమచందురుని వంటి బుత్తుఁడు వొడమెన్। గ్రొన్నెల బాలుపు నాలికి।
మున్నల కొమరుండు నెమ్మిఁ బుట్టినపగిదిన్ ॥ ౩౨॥ ఉ॥ ముద్దులమూటగట్టు నలబొట్టియ
పుట్టుక యప్డు వేలుపుం। బెద్దపులుంగు తత్తడిని వేడుక మీఱఁగ నెక్కి వచ్చి, వీ। డద్దెస లేలు
నేలికలయం దొకఁడై మఱిరొక్కపుంద్రొరా। నద్దిర వీనిపున్నమని యానతియిచ్చి
ధనేం దనంతటన్ ॥ ౩౩॥ చ॥ వడిఁ గొనరించి యామొదలు ప్రాఁజదువుల్ చదివించి

తండ్రి నేర్పడరఁదనంతవానిగను నన్నిటఁబెద్దిప నారితేరుటన్। విను వనిపూని కృఁ గాలి బొటనవ్రేలూకయుంచుక నేలమోపి నట్టడవినినొంటిపైఁ దపసినై యశేఁకుండెను దండ్రి పోలికన్॥ ౫౪॥ క॥ వేయేఁడులు నీరానియు। వేయేఁడులు గాలిఁగ్రోలి విడువక యాపై। వేయేండ్లో గిరమొల్లక। యాయడవిం దమ్మిచూలి నతఁడుతలంపన్॥ ౫౫॥ ఉ॥ నిద్దపుఁబండువెన్నెలల నిపెండుసొంపగు రెక్కఁ ప్రక్కలన్। ముద్దుమెఱుంగుదీగియలఁ బోలిన బంగరురంగు చారలం। దద్దయు మించు నంచపయిఁ దామరచూలి కరంబుడంబుగా। నొద్దకు వచ్చి యచ్చెరువు నొందికనుంగొని నింగినిట్లనున్॥ ౫౬॥ క॥ ఎమ్ములు దక్కఁగ నొక్కటి। నెమ్మేనం గానరాదు నిలువెల్లఁ జెదల్। క్రమ్మెను మెచ్చితిఁ దాల్మికి। గొమ్మా యిదె కోర్కులిత్తుఁ గోరిమికుఱ్ఱా॥ ౫౭॥ క॥ అనితన కమండలంబున। నునిచిన తెలినీరు మీఁద నొకయించుక చల్లిన నెప్పటిపైజిగితోఁ। గనుపట్టి యచటు వెలువడి కడు నర్మిలితోన్॥ ౫౮॥ మ॥ పెనులిబ్బింగనుఁగొన్న పేదపగిదిం బెల్లుబ్బి కేల్దోయి మోడ్చి నిరాబారి కడానిబొజ్జగల జేజేమిన్న నగ్గించి యిట్లనియెం గోరిమి మీర నియ్యఁగఁడ్డవయ్యా వేడెదన్మిమ్ముఁ జిక్కనిబల్మిన్ దెసయేలుమేలుఁ బెనురొక్కంబుండు బండాలమున్॥ ౫౯॥ చ॥ పనిగసతమ్ము మిమ్ముక నెపమ్మున నెమ్మది నెమ్మినమ్మినం। గనికరమూని వానిముడికానిని నైనను గాతురన్న యుమ్మనుమని నన్నుమిన్నకయ మన్ననఁదిన్నఁ జేయుట బ్రహ్మ। యనవుడు నన్ని నీవడిగినట్టు లొసంగితినంచు వెండియున్॥ ౬౦॥ క॥ మెండు పరికించి నేర్పున। దండిమగనివల్లె త్రాడు దాల్పరి నిజమున్। గొండల పిండుల రెక్కలు। చెండంగల వేల్పుటేనిఁ జేవదలిర్పన్॥ ౬౧॥ క॥ పొడమించి వారివరుసగఁ। బడమరదక్కిన ముతూర్పు వైపులకున్ను। న్నొడయలను గాఁగఁ జేసియుఁ। గడమకడనిఁ కెవ్వఁడేలఁ గలఁడని యుండన్॥ ౬౨॥ తే॥గీ॥ తగినవాఁడవు దొరికితి తలఁపనేఁడు। నాదు మదివంత యంతయు నడచెనిపుడు। గట్టువిల్కాని తోఁ జెల్మికదలకుండు। పుష్పకంబను తేరిదిపుచ్చుకొమ్ము॥ ౬౩॥ చ॥ చలువయు వెట్టయున్ వలయు చందములన్న మమార్చు ముజ్జగం। బులు దిరుగంగ నింగివయిఁ బోవఁగవచ్చును దీని నెక్కి యుక్కొలఁదులు తెల్పఁ దెల్ప మఱిక్రొత్తలొసంగితి నీకునింక జక్కులుకొలువంగ నీ కొలువుకూటములోఁ గడుఁబేర్మిఁ గాంచుమా॥ ౬౪॥ వ॥ అనినొసంగి మఱియును॥ క॥ కనికరమునను గనికరమున। మనుమని మనుమని యటుపలుమాఱును దీవించి నలువయిచ్చను జనియెం। దనమనికికి నౌర మంచితనమన పొగడన్॥ ౬౫॥ ఉ॥ అంచపయు మాయిజోదు చనినంతటఁ దండ్రిని జేరఁబోయి లోనుంచిన కూర్మి ప్రొమ్ముక్కలిడి యుబ్బుచు లిబ్బుల కేఁడు కాంచి దీవించిన తండ్రిఁ జూచి తమరిచ్చిన యానతి నల్వఁ గొల్చి మా। పంచిన పెంపులం బడసి వచ్చియు నొక్కటి వేడ నొడితిన్॥ ౬౬॥ క॥ పెఱవారెవ్వారలకుం। దఱిగానిదరము కాని తావాక్కటి నే। నెఱినుండుటకున్ వేడఁగ। మఱిచితి చోటొండు చూపి మన్నింపఁగదే॥ ౬౭॥ క॥ అన నసుఁగు పట్టి మొగమా ల్లనఁగని

కపుబుజ్జగించి లలినాతఁడిదం । గనికర మిగురొత్తంగా । వినిపించెద నిలువనేలవు
వినుమనిపలికెన్॥౯౮॥ తే॥ గీ॥ ఉప్పరంబంటుతరగల యొప్పుతోడ । విలువరతనం
పుగుంపుల పెంపుతోడ । జిమ్మ వెలుంగని గొప్ప మొసళ్ళతోడ । నుప్పునీటిసంద్రము
కరంబొప్పనందు ॥౯౯॥ ఉ॥ జాలులయంచు ఛందముల చాలగు వేలుపు పేటిదిటునం।
గ్రాలెడు తావి ప్రోవులపు గమ్మనికస్తురి తావి తైవడిన్ । జేలలలోనఁ జీనివని చీరెలతీరు
నఁ బూల జాజిపూ । పోలికలంకపొంకమగుఁ బొల్పగుదీవుల మేలుబంతియై॥ ౧౦౦॥
సీ॥ పలుకోటకొమ్మల మలచిన సింగముల్ దెసయేనుఁగులనెల్ల దిగులువరుప । నగరి
యుప్పరిగల మగరాలజగడాలు విన్నేటినీటితో వియ్యమంద । వీటనీటుగఁ గ్రాలు వెలి
డాలుగమిగాలి వేల్పుజంటలకును వేడ్కలాసఁగ । విరిదోఁట నెత్తావివిన్నంటి వేల్పు
ప్రమోఁకులకెల్లఁ గొల్లగావలపులియ్యఁ । గలికి పగడంపు సోరణగండ్లు రేలు తావలవిం
దున కేగంగఁ ద్రోవసూప । వీడు తొలివేల్పుగములకై విశ్వకర్మ । లంకయనుపేరఁ
జేసె నాలంకయందు॥ ౧౦౧॥ క॥ వెన్నునికి వెఱచిపాఱిరి । మున్నటనున్నట్టివారు
మొన్నను నిపుడా । సన్నయె ఱింగిలిగావున । నన్నా నీవేగియుండు మచ్చట నెమ్మిన్॥
౧౦౨॥ క॥ క్రిందిజగమ్మున నిలిచిరి । యందలి రేద్రిమ్మరీండ్లు నచ్చటనీ కే । తొందర
యుఁగలుగనేరదు । సందడిచూపంగలేరు జంకక పగరున్॥ ౧౦౩॥ చ॥ అని నెలవి
య్యనప్పలుకు లాదలఁదాల్చి కుబేరుఁ డప్పుడే । చనిచని లంకఁ జేరి పలుచందములందను
గారవంబుతో । ననయము వేల్పు పిండు గొనియాడఁగ నేలుచునుండి పుష్పకం । బొ
నరఁగ నెక్కివచ్చి కనుచుండును నిచ్చలుఁ దల్లిదండ్రులన్॥ కం॥ అనిరారాజు తెలింగి
టు । వినిపింపఁగ రాముఁడలరి వింతగమదిఁ దో । చిన నచ్చెరువందియుగ । స్స్యానిఁగని
యిట్లనియె వేడ్కదుడుకొనరింపన్॥ ౧౦౪॥ ఉ॥ ఓజడదారిరాయ యిపుడుల్లము
పల్లుడుకందొడంగెరా । రాజుకుమున్న లంకనుదిరంబుగఁ గైకొని సోకుమూక లెం।
తేజిగిమీర నేలునటులీరటు పల్కుటవిన్నసుండి, నే । నీజగమందురక్కసుల నెల్లఁబు
లస్త్యకులంబువారిఁగన్॥ ౧౦౫॥ ఉ॥ విందును ముందు, వెండియొకవింతగ రావణుకన్న
మున్న లం । కంపగఁ బెక్కురక్కసులు గ్రాలిరటంటిరి వారిపేళ్లనా । యందటివం
గడంబు ముపపాకటి వేల్పునకోడి డాగుటల్ । సందియమూఱఁ దెల్పగదె సాగిలి మ్రొ
క్కెద నీకు నావుడున్॥ ౧౦౬॥ పంచచామరము॥ అగస్త్యుఁ డంతఁ జెల్వుగుల్క
నంచమొలుకపల్కులం । బొగడ్తఁ జేసి వాని రాము మోము గోము మీరఁగా। జగాని
గారపోరచూపు జాలు వారఁ జూచి డం । బుగా నెలుంగు కంగుమంచు మ్రోగ వేగ ని
ట్లనున్ ॥౧౦౭॥ మ॥ లొలుత న్నెన్నని బొడ్డుదమ్మి నెలమిం దాల్పోల్పు తాఁ బుట్టియ ।
వ్వలమున్నీ రొనరించి దానిఁ గొని కాపాడంగ పేదాల్పులం । గలిగింపందరు నాత వార
లటనిన్ సంతోసపూరంగపూ । పలనంగల్గిన కర్జమేమి వినిపింపం జెల్లునా నాతఁడున్॥
౧౦౮॥ క॥ మిమ్మిందఱఁ గలిగించితి । నిమ్ములనిన్నీరు ప్రోవ నిప్పుడ చనిమీ । నెమ్మది

మమ్ముఁదలంపుచు । నెమ్మెయిఁగా చెదరొ చూతమిందటిబలముల్ ॥౧౦౯॥ క॥ అనిప
నిచినవల్లేయని । పనివినిమున్నీరుగాచు పనిపూనికడుం । గనుకలిగియుండియాకలి ।
గొనిడప్పికి నిలువలేక క్రోలుదమనుచున్ ॥౧౧౦॥ క॥ తలపోసియంతఁబొంతను । న
లుమోముల వేల్పుఁగాంచి నక్కుచుఁదమలో । వెలవెలబారుచుమిక్కిలి । యలనియు
నీరానఁగొంకియడఁకువతోఁపన్ ॥౧౧౧॥ క॥ సాకెదమనియొకకొందఱు । మైకొని
రిఁక మెక్కెదమని మఱికొందఱు పె । ల్లాకలికోర్వకపలికిరి । యాకొని నెత్తమ్మిచూ
లి యుల్లంబలరన్ ॥౧౧౨॥ క॥ మెక్కెదమనువారందఱు । జక్కులునబరాకు
లేక సాకెదమనువా । రక్కజముగసోకుడులును । నిక్కము గానౌదురంచు నెట్టనఁ
బలికెన్ ॥౧౧౩॥ తే॥గీ॥ పెక్కులమ్మాడ్కిజక్కులురక్కసులును । బొడమిపుడ
మిని బొఁగడికవడసిరడరి । వారిలోపలనెంతయు వాసిగనిరి । హేతియుఁబ్రహేతియు
ననంగ నిరువురందు ॥౧౧౪॥ క॥ నెమ్మదిఁబ్రహేతిముద్దుల । గుమ్మలకూటములురోసి
కోర్కులనెల్లం । గ్రమ్మితెగఁగోసిమిక్కిలి । ముమ్మరమగునీసువాని పొలుపుగనుం
డెన్ ॥౧౧౫॥ ఉ॥ రెండవనిబ్బరంపు రెయిద్రిమ్మరిఱేఁడల హేతిదండియై । పెండిలి
యయ్యెనుయ్యభయపేరిటి ముద్దులగుమ్మఁగొమ్మఁబూ । చెండులఁబోలు చన్నుఁగవఁ
జెన్నగుదానినినల్వయానతిన్ । వెండియుడెందమందు మగబిడ్డలకైగల కూర్మిపేరిమిన్ ॥
౧౧౬॥ క॥ ఆయిరువురకుంబుట్టెను । దీయనివిల్కానితోడ దీటైయనివెన్ ।
దీయనివిద్యుత్కేశుఁడు । సోయగమునకింతులెల్ల సొగయుచునుండన్ ॥ ౧౧౭
॥తే॥గీ॥ తల్లిదండ్రులకన్నులు చల్లఁబడఁగ । విద్దెములుచేసె కొన్నాళ్లువెనుకవెనుక ।
తప్పటడుగులు పెట్టుచు తడవునడచెఁ । బిదపజిలిబిలిపలుకులఁ బిలువనేర్చె ॥౧౧౮॥
తే॥గీ॥ అట్లుముద్దులుగురియుచు నలరఁజిన్ని । తనముమెల్లనజాఱె జవ్వనముమొ
లిచెఁ । జిన్నిపాయంపుమేనికి వన్నెయొసఁగి । కుందనంబును నెత్తావిపొందినట్లు ॥
౧౧౯॥ తే॥ గీ॥ వెడఁదఱొమ్మున కొకవింతవీఁకయొదవె । నగుమొగంబునకొక వింత
జిగిదొలంకె । మీసకట్టునకొకవింత మిసిమితోఁచె । హేతిపట్టికి జవ్వనమింపుమెఱయ ॥
౧౨౦॥ క॥ అప్పగిదిముద్దుకొమరుని । యొప్పునకుందగినయట్టి యొయ్యారినిదాఁ ।
దప్పకపెండిలిసేయఁగ । నప్పుడుతలపోసిహేతి యందఱుమెచ్చన్ ॥ ౧౨౧॥ సీ॥ కవ
జక్కవలఁబోలి తావపెక్కువలనేలి చన్నులుకన్నులు చెన్నుమీర । జిగిమెఱున్నవలె
మించి తగమిన్నుఁదులకించి మేనునుగోనును జానుమీర । నిరులసొంపునుమీరి తరగగుం
పునుదూరి కురులునుదరులును గొమరుమీర । నరటాకుఁగనినవ్వి మరుబాకులనురువ్వి
వీపునుజూపును వింతమీరఁ । జిలుకపలుకులుఁ జెలువంబు గులుకుచెవులుఁ । దళుకు
తొడలను నొయ్యారమొలుకునడలు । మొలకనగవును జిగిమోవి గలిగియలరు । వెలఁది
సంధ్యకూఁతును దెచ్చిపెండ్లిచేసె ॥౧౨౨॥ శా॥ ఆవాల్గంటియు మున్నువిన్నసిగదయ్యం
బున్మదిన్నెయ్యముల్ । దైవారన్ వినువాకపెండ్లియగు చందానందగంబెండ్లియై । పే

వేగం దొలిచూలు దాల్చి కొమరున్ వేఱొండుచోఁ గాంచి యా।క్రేవం గవ్వపుఁ గొండ
దండనిడి యేగెం బెన్మిటిం గూడఁగన్॥ ౧౨౩॥ తే॥ గీ॥ తెగుదురెంతటివనికైనఁ దగ
వుఁదలఁచ।రించుకయు బొంకఁ గొంకరు మంచివానిఁ। దలఁపువడిరేని యేమైనఁ గలయఁ
జూతు। రహహా యెంతటిజెంత లియ్యాదువారు॥ ౧౨౪॥ క॥ పసిపాపఁ డేడ్వఁ జూచ్చె
ను। దెసలెల్లను మాఱుమ్రోయ దిగ్గున మెకముల్। వెసనులికిలేచి వెఱపున। మసలక
నలుదెసలఁ బాఱ మఱిమఱియు చటన్॥ ౧౨౫॥ వ॥ అప్పుడు॥ సీ॥ మొనలకైదువుతోడ
మురిపెంపుటిరిగుంపు మఱపింపు కుత్తుక యొఱపుతోడ। తలవాకజిగితోడ తెలిమబ్బు
వెలిద్రొబ్బు తెలిగిబ్బతత్తడి పొలుపుతోడ। పాపపేరులతోడఁ బగడాలజగడాలు నగఁ
జాలుజడల సోయగముతోడ। పునుకపళ్ళెముతోడ మినుముట్టఁగను పట్టు పెనుగట్టువింటి
యొప్పిదముతోడ। చిన్నిక్రొన్నెల వన్నెల చెన్నుతోడఁ। బేసికన్నుల చిన్నెల వానితోడ।
గట్టుదొరపట్టితోఁ గూడి గట్టువిల్తుఁ। డపుడు తఱిగట్టుదరికి వయ్యాళివెడలె॥ ౧౨౬॥
తే॥ గీ॥ మింటవిచ్చేసి యచ్చెనికంటివేల్పు। చెంతనొకవింత రొదయింత చెవులుసోక।
నిలిచియాలించి గాలించి నిసువునొకని। మ్రోలఁదిలకించి పరికించి జాలిగాంచి॥ ౧౨౭॥
మ॥ కదియంబోవుచునున్నవేళ మలరా గారాబపుంబట్టి పయ్యెద కొంగించుక యోర
జారవలచే నిట్టట్టు గానొత్తుచున్। మదిలో నక్కటికంబు పిక్కటిలఁ గానవ్వచ్చి యా
బిడ్డయం। గదమాన్పం దగునంచుఁ బల్కుటయు నాక్రాల్గంటి పైఁ గూరిమిన్॥ ౧౨౮॥
క॥ జవరాలి జాలిమాటలు। జవదాఁటక చావులేక చను బ్రతుకు దెసల్। బవరముల గెల్చు
బలిమియు। దివిఁ ద్రిమ్మరు వీడుఁ దల్లిదినుసగు నీమున్॥ ౧౨౯॥ తే॥ గీ॥ ఒసఁగి యేను
మోములసామి యారకున్నఁ। గాంచి రాణియు నెనలేనికనికరమున। జవ్వనంబును
బీరంబుఁ జక్కదనముఁ। గలిగి యప్పుడె యొప్పఁగ గారవించె॥ ౧౩౦॥ క॥ దేవరయును
దేవేరియుఁ। గావలసిన కోర్కులెల్ల గారాబముతో। దీవించి వేడలేఁడని। వేవేగను సం
గబిడ్డ వేడుకఁ జెందెన్॥ ౧౩౧॥ గీ॥ అడవిఁ గనిపాఱవైచిననైనఁ బ్రతుకుఁ। దల్లి కడు
పుచల్ల నొకింత తగ్గదేని। యింట బంగరుతొట్లలో నిడిననైనఁ। జచ్చుఁ దల్లి కడుపు
చల్లచాలదేని॥ ౧౩౨॥ గీ॥ అట్లు పసిపాపయప్పుడె యుబ్బురముగ। నిండు పరువంబుఁ
గైకొని నిలిచి కేలనఁ। బూపనెలదాల్పుఁ గనికూర్మి మ్రొక్కియతని। చెలువకు జోహారు
లొనరించి చేరి కొలిచి॥ ౧౩౩॥ ఉ॥ వారలయానతిన్ మిగుల వన్నెయు వాసియుఁ గాంచి
వారిఁ గై।వారము చేసి వీడుకొని వారొనరించి యొసంగినట్టి యా।యూరను రక్క
సుండు గడునుక్కునఁ గాపురముండి తద్దయున్। బీరముతో సుకేశుఁడను పేరను
గారవమందె నందులన్॥ ౧౩౪॥ క॥ ఆతనిసోయగముం గని। చేతులగరువంబుఁ జూచి
సోలఁగుచు నిటకున్। లేతఁగ గ్రామణియను వే।ల్పేతెంచి సుకేశుఁ గాంచి యొంటయు
వేడ్కన్॥ ౧౩౫॥ సీ॥ అందంపు ననుజెక్కు లద్దంపు మించులు మించులు నిద్దంపు మేని
జిగులు। కాటుక పెన్నెరుల్ తేటిమొత్తమ్ములు తమ్ములు తెలివాలు తళుకుగనులు। నిం

వైనఁజిఱుపచ్చ పండువెన్నెలనిగ్గు నెలనిగ్గుచక్కని నెమ్మొగంబు । వన్నెబంగరుగిండ్లు
వలిగబ్బిగుబ్బలు గుబ్బలుల్ పిఱుఁదుల గొనబుఃపొలుపులు । చెప్పనొప్పనె యపూర్తి
యొప్పిదంబు । నట్టితనకూఁతుఁ జిన్నిపాయంపుదాని । నందములకెల్ల నందమై యలరు
దాని । దేవవతినాఁగఁ జనుదానిఁ దెచ్చియిచ్చె ॥ ౧౩౬ ॥ క॥ అరమరలులేని కూర్ములఁ ।
గరమరుదుగఁ గలసిమెలసి కలికియుమగఁడున్ । నిరివిరిబోడినివెన్నునిఁ । బురుడింపుచు
మరునికయ్యమునఁ బెనఁగొనుచున్ ॥ ౧౩౭ ॥ గీ॥ కొన్నియేఁడులు పోడిమినున్న పిదప ।
మాల్యవంతుఁడును సుమాలిమాలియనఁగ । ముప్పురవ్విరిబోడికిఁ బుట్టిరెలమి ॥ ౧౩౮ ॥
క॥ ఆమువ్వురుఁ దండ్రివలెం । దామును బెనుమెప్పులందఁ దపసొనరింపం । గా మదిఁ
దలఁచి యిలువెడలి । యామునగవినీమంచు కొండయండకుఁ గడిమిన్ ॥ ౧౩౯ ॥ చ॥
చనిదిటమూరఁ జెట్లను సుజాయల డాయక బట్టబైల నొక్కొనువడగాలిఁ గ్రోలి మదిఁ
గొంకక జంకక యొంటికాలునం । బనుపడ నిల్చి పొల్చి నలువందపు యంచపు డెందమం
దు వేడ్క నదలపోయచుం దబుసుగా సిలిచేసిరి వారుమువ్వురున్ ॥ ౧౪౦ ॥ క॥ జగ
ములనుదబుసువేఁడిమిఁ । బొగలెగసెను మింటుమంటు మొత్తము పర్వెన్ । వగలం బొగిలిరి
వేల్పులు । బెగడొందెను జాలవేల్పు పెద్దయు మదిలోన్ ॥ ౧౪౧ ॥ ఉ॥ దానికిఁ దాళఁ
జాలక వెతం దెలుఁగంటులు డద్దరిల్లి లోనూనిన నివ్వెఱం గదలి యాడని బాడిరి తమ్మి
చూలికిం । బానలుదీర రక్కసుల ప్రల్లదనంబులు విన్నవింపఁగాఁ । బూనికడెంక దోఁప
నటను న్నె యతండును నెంకువేడుకన్ ॥ ౧౪౨ ॥ ఉ॥ అంచపుమాయునెక్కి తెలి
యంచపుటెక్కుల డాలునల్గడల్ । ముంచుకొనంగఁ గెంపుజిగిముక్కు మొఱుంగులు
చౌకళించి షోల్గాంచిన జాళువా బొమిడికంబుల డంబగు మానికంపు గ్రొమ్మించుల
తోడమాల్యలయు మింటనువచ్చెను వారిపజ్జకున్ ॥ ౧౪౩ ॥ క॥ వచ్చేసి వారిమేనులు ।
మచ్చికతోఁ గేలనిమిరి మదితాల్మికిలో । నచ్చెరువందుచు దీవెన । లిచ్చి కనికరంబు
దోఁప నిట్లనిపలికెన్ ॥ ౧౪౪ ॥ ఉ॥ రక్కసులార చేరువకు రండిదె వచ్చితి మిమ్ముఁ జేరఁ
గా । నిక్కరణి న్నెతల్ గుడువ నేటికి మీకిఁక లెందుతాల్మికి । న్నిక్కముగాఁగ డెంద
మున నేఁగడు మెచ్చితి మీపయిం గరం । బక్కటికంబు పుట్టె నిపుడారసి కోరుఁడు కోర్కు
లిచ్చెదన్ ॥ ౧౪౫ ॥ క॥ అనిపలుకుల వెలఁదుక చక్కనిమేలిమియం దెరవళిఁ గైకొనని
యొలుం । గుసఁ దొలివేల్పానతియిచ్చిన విని వడిలేచివచ్చి చిడిముడితోడన్ ॥ ౧౪౬ ॥
చ॥ అలవలకేల నల్వయొడలంటిన వెంటనె యట్టెతొంటి యాయలసటవాసి వాని
గని యారెయిగ్రిమ్మరు లక్కయమ్మడిం । బలుకులఁ దేనియల్ దొలుకఁ బొరఁగఁ
గేల్గవదోయి లించి యిచ్చలఁ దొలివేలుపుం బొగడఁ జాగి తెకన్నులు విచ్చి యచ్చటన్ ॥
౧౪౭ ॥ క॥ జగములఁ బుట్టింపనుమతి । నెగడింపను గినుకఁ బూని నీర్గింపను మేలుగ
దగు నెఱ్ఱపోసవు నీవెగదా నెత్తమ్మిచూలి వేలుపుపెద్దా ॥ ౧౪౮ ॥ క॥ జతలేని నీదులఁ
దగిసే । పుతకము తెలియంగలేక మైదాల్పులొడల్ । సతమని నమ్మి కరమ్మును । పాతలం

బడి పొరలుచుండ్రు వెఱ్ఱులవగిదిన్॥ ౧౪౯॥ శా॥ ఎందున్మీసరిపోల్పఁగాఁదగిన వే
ల్పెన్నంగ నొండొక్కఁడీ। యందంబైన జగంబులోపలఁ గలండా పేర్కొనన్నిమ్మి
మి।మ్ముందోరంబుగనమ్మి వేడుకొనుటల్ ముంగొంగుబంగారుగా। ముందున్నిందుకు
నేఁడుమాకది నిజంబుంజేసితివిమ్యాడన్॥ ౧౫౦॥ క॥ మాపైఁగనికరమొలయఁగ। మా
పూన్కికిమెచ్చి మమ్మమన్నింపంగా। నోపెదవే నిన్వేడెద। మాపయిమామేలును దమ
యక్కటికంబున్॥ ౧౫౧॥ కడదొరలను బవరంబుల। నొడువంగల బల్మిమాకు నొం
డొరులవయిన్। విడువనికూర్మియు సిరులును। నొడపకవేలుపులవేల్ప యొప్పింపఁగదే॥
౧౫౨॥ గీ॥ అనుచుఁగొనియాడి తనువేడఁ గనికరమునఁ। గోరికలనిచ్చి ఒలిమెచ్చి
కూర్మిపేర్మిఁ। దడవు దీవించి మించి నెత్తమ్మిచూలి। కదలి చనుదారిఁ దనవారిఁ గలసి
చనియె॥ ౧౫౩॥ వ॥ అంత॥ ఉ॥ వేలుపుఁబెద్ద తానిడిన విప్పగుమెప్పుల నొప్పమీఱి
తా। ల్వేలుపుఁబెద్దలొక్క మొగిడిక్కుచు నిక్కుచుఁ గండక్రొవ్వునన్। వేలుపుఁ
బెద్దలంగెలిచి వీరినివారిని బోలివారలన్। గేలిమొనర్చి పేర్చి పెనుకిన్కమెయిం జెఱ
ఁబెట్టిరింతులన్॥ ౧౫౪॥ క॥ పొడిచిరి పెక్కుర జక్కులఁ। జడదారులఁగాళ్ళ రాచి చ
మిరిరి నేలన్। గడతేర్చిరి చిలువల నొక। కడకుం దెచ్చిపొగరెచ్చి కలఁచిరి జగముల్॥ ౧౫౫॥
గీ॥ వారుపెట్టెడి కట్టిడిఁ బడఁగలేక। యిండ్లువాకిండ్లు విడనాడి యొదలనూడి। కన్న
కన్నవారల నెల్లఁగాళ్లఁబట్టి। వట్టియనదలై వెల్పులుకట్టువడిరి॥ ౧౫౬॥ సీ॥ ఒకవాడ
మొకమోడ గొకవేల్పుఁగొట్టింతు రొకవంకజముఁలెంక నొడిసిచఱతు। రొకచక్కి
పొగరెక్కి యొడయండ్లఁబట్టింతు రొకచాయఁదొగదాయ నొడుగనడతు। రొక
దారి జడదారి నొఱపులఁబెట్టింతు రొకచెంత నెలనింత యుక్కడంతు। రొకమేల
వినుచూలి నూరకకట్టింతురొకదండజమునండ నోలిఁబంతు। రొక్కయిక్కనజక్కుల
యుబ్బడంతు। రొక్కగిమునఁబాముల నుక్కుమిగులఁ। బెక్కులాగుల నేగులఁ
బెట్టుచుండ్రు। రక్కసులు ముప్పురును గ్రొవ్వుపిక్కటిలఁగ॥ ౧౫౭॥ సీ॥ నీళ్లమో
వఁగలోఁగె నెఱిమాలి నెలదాల్పు కనుమూయుటుడిగె వేగనులవేల్పు। బిచ్చకానిని
జేరె వచ్చిజక్కులఱేఁడు పిచ్చుకుంటైపోయె బెగడిజముఁడు। రేలుద్రిమ్మరుచుండెఁ
దూలిరక్కసుఁడెప్డు ఇంటయిండ్లనడంగె వచ్చిచిచ్చు। వంకలకిరవయ్యె వలగొని నీటి
ఱేఁడొకమూలఁబడియుండె నుకఁడుగాలి। తక్కుగలవేల్పులెల్లను దల్లడమున। బ
యలువట్టి తిరుగునట్టి బ్రతుకుగనుటె। కాకనోరికోరెమొకింతలేకమనిరి। యకటచె
ప్పెడిదేమియాయాగడంబు॥ ౧౫౮॥ క॥ ఇక్కరణి మ్మువ్వురు నా। రక్కసులుం
గండకావరంబున నేరిన్। లెక్కయొనర్పకయుండిరి। యెక్కడఁగనుఁగొన్నదమరె
యగుచుఁగడిమిన్॥ ౧౫౯॥ తే॥గీ॥ అంతనొకనాఁడు వేడుకలనఁగిపెనఁగఁ। బెద్దకొలు
[illegible]ండి ముప్పురుఁబెంపెసంగ। వేల్పుటగసాలిఁబిలిపించి వెఱవుమీఱ। వలయుమరియా
దలొనరించివానికనిరి॥ ౧౬౦॥ క॥ ఓయీవేల్పులకందట। కాయాకొలఁదుల నెఱిం

గీ యందపు నెలవుల్ । సేయుటవలనను నీపే । రేయెడలను వన్నెకెక్కె నింతయు నలమెన్॥ ౧౬౧॥ ఉ॥ కాపుసమాకునుం బసిఁడిగట్టునసైనను వెండికొండసై । నావలనైనమంచుమలనైనను గవ్వఁపుఁగొండనైనన్ । నీవెరవంతయున్నెఱపి నిక్కపుఁజిక్కనిమానికంబులన్ । తీవియెలర్పఁగూర్చి యిపుడీయెడఁగూర్పవు పైడిమేడలన్॥ ౧౬౨॥ క॥ అనినన్ జేతులుమోడిచి । యనువొప్పఁగవారిమోములందు నెషూడ్కెల్ । పెనచియడంకువతోనిటు । పని తెఱఁగెఱిఁగించె నతఁడువారలతోడన్॥ ౧౬౩॥ తే॥ గీ॥ జగునికడయందుఁ బొలుపొందుసంభ్రమంబు । నెసఁగు నొకదీవి పెనుతీవి యెల్ల మెరసి । పుడమియందున నెందునుబుట్టరాని । మానికమ్ములనిమ్ముల మలచి తెచ్చి॥ ౧౬౪॥ ఉ॥ వేలుపుఱేనియానతిని వింతగఁజేసితి వీడొకండు తా । ల్వేలుపులార యున్నగడు వేడ్కఁద్రిమ్మటయుఁనాగఁ బేరునం । గ్రాలెడుకొండకొమ్మునను నా తెలివెల్లను వెల్లడింపఁగా । నేలినవారికయ్యదియె యిమ్మగునిమ్మని నాకుఁదోఁచెడున్॥ ౧౬౫॥ సీ॥ ఏవీటికిని నాల్గుప్రాకారములందునుజుట్టి సంభ్రమగడ్తమైచవులునింపు । నేయూరి పెనుకోటఁ బాయకబురుజుల నేపునవేల్పులు కాపుగాతు । రేప్రోలపరువాత నెల్లకనిద్దుర మిన్నేటియలుకుడు మేలుకొలుపు । నెందలిరతనాలు చిందిపడఁగడలితావలంబయ్యె రతనములకును । ఎచటి యెలదోట గమితావియొసఁగిమింట । వేల్పుటాండ్రకు మగలకువేడ్కలొసఁగు । నెచటిపయ్యెరలడతేరియెల్లయపుడు । చెఱుకువిలుకాని కయ్యంపుఁజెమటలార్చు॥ ౧౬౬॥ వ॥ అట్టిసింగారంబులకుం బుట్టినిల్లును గలుములు కాటపట్టును బీదసాదలకుం బసిండికొటారును బెద్దలకుం బట్టుగొమ్మయునయి చెన్నలరుచున్న॥ ౧౬౭॥ ఉ॥ లంకను జేరిమార్తురనలంతులఁ బాఱఁగఁదోలి [illegible] । బొంకముగాఁగఁ గల్మిలిడిప్రోచుచు మీసరిసాటివారిలో । నంకిలిలేనిగొప్ప [illegible] గలారని వేల్పువఁడ్రవాఁ । డింకను గొన్నిపల్కులెదకింపుగ మంతనమందుఁబల్కెనన్॥ ౧౬౮॥ ఉ॥ సంతసమందిముందఱను సామిమహాసాదని పెద్దయెల్గునన్ । వింతగఁబల్కచుం బసిఁడి బెత్తములెత్తి యదల్చిమూఁకనం । తంతఁదొలంగఁదోలి పనిహారులు నూరెల దారిచేయఁగాఁ । జెంతలఁజేరియుండొరులఁ జీరుచుదండులు వెంబడింపఁగన్॥ ౧౬౯॥

---

ఇంతవఱకు ౧౮౭౨వ సంవత్సరపు పురుషార్థప్రదాయినిలోఁ బ్రకటింపఁబడి యున్నది.—కం-వీరేశలింగము.

తే॥ గీ॥ కదలిపోలదిండ్లయార్పు లాకసముముట్ట । లంకఁజేరిరి మువురుఁ గలంకదేరి। యంత వారలబీరంబు నలవుబలిమి । యరసి నర్మదయానెడు నచ్చరనెలంత॥ ౧౨౦॥
క॥ పువ్విలుతునివాలారుం। గ్రొవ్విరితూవులొయనంగఁ గొమరారెడు లే।జవ్వనులం దనకూఁతుల। మువ్వురఁగొనివచ్చియిచ్చె మువురికినెలమిన్॥౧౨౧॥ వ॥ అందు మాల్యవంతుండు సుందరియను తనవెలందియందు వజ్రముష్టియు విరూపాక్షుండును దుర్ముఖుండును సుప్తఘ్నుండును యజ్ఞకోపుండును సున్మత్తుండును మత్తకుండును నను నేడుగురు కొడుకులను నిలయను కూఁతునుం గనియె సుమాలికిఁ గేతుమతియను ప్రోయాలియందుఁ బ్రహస్తుండును నకంపనుండును వికటుండును శకటముఖుండును ధూమ్రాక్షుండును దండుండును సుపార్శ్వుండును సంహ్రాదియుఁ బ్రఘసుండును భాసకర్ణుండును నను పదుగురు కొడుకులును బకయుఁ బుష్పోత్కటయుఁ గైకసియుఁ గుంభీనసయు నను నలువురు కూఁతులునుం గలిగిరి మాలి వసుధయను దన వాల్గంటియంద నలుండును నీలుండును హరుండును సంపాతియు నను నలుగురు కొమాళ్ళం గాంచె వారె విభీషణునకుం బ్రగ్గడలై వెగ్గలంపు టగ్గలికలర జెన్నుమీఱిరి॥ ౧౨౨॥
తే॥ గీ॥ ఇట్లు తామరతంపరై యేపుఁజెంది । జగములందెందు నెవ్వారి సరకుగొనక। విఱ్ఱవీఁగుచుఁగొడుకులవెంటఁగొనుచు। ముజ్జగంబులుఁగలఁచిరాపోలసుదండ్లు॥౧౨౩॥
ఉ॥ వారల రాయిడిన్నొగిలివాంఛిత వెల్లనిమోముదమ్ములం । గూరిన నెవ్వగం గదలికోరికలీరికలెత్త వేల్పులె।ల్లారలఁజేరువారమిఁక వాసిగనుండఁగ నెద్దితావిఁ కె।వ్వారికి విన్నవింపుదము వారలయాఱడియంచు నెంచుచున్॥ ౧౨౪॥ క॥ ఆరసి కర్జముఁ గని యి।బ్బారిని నలమలవిలుగలవాఁడడఁపంగా। నేరుచునని పొంగివడిం । జేరి రొకట వెండికొండ చెంగటికెలమిన్ ॥ ౧౨౫॥ చ॥ అటువలెవెండికొండఁ దటియంజని హేలిమిగద్దెమీఁద న।చ్చోటఁ గొలువుండి వేడుకలఁ జొక్కుడుమిక్కిలి కంటిదేవరం। బొటపొటఁ గన్నులందొరిగి ముమ్మరమై చను నీటిజాలుతో । నటమటుమాఱఁగాంచి మదినక్కుచు నెయ్యమునుం బెనంగొనన్॥౧౨౬॥ తే॥ గీ॥ ఒదుగువాటున నిలుచుండి మొక్కపెట్టఁ। జేతులుమొగిడ్చి జోహరుచేసినిలిచి । వేల్పుటేఁడును ముమ్మారుగా వేల్పులెల్ల । నెలుఁగుకుత్తుకల దగులంగ నిట్టులనిరి॥ ౧౨౭॥ తే॥ గీ॥ ఏనుపెకాములవేలుపాయిదెజోహరు । ఇవముగుబ్బలియల్లుఁడ యిదెజోహరు । ఇంచువిలుకాని పగవాఁడ యిదెజోహరు। ఎక్కుడుకనులదేవరా యిదెజోహరు॥ ౧౨౮॥ చ॥ ఉడుగని కిన్కతోఁగదలి మొక్కటినెక్కుడఁ గన్నదామమై। కడఁకసుకేశుబిడ్డలు జగంబులనేపఁగఁ దల్లడిల్లి యి।మ్మ్యెడలను ముజ్జగంబులను నేలెడు దేవరవీవటంచు నీ।యడుగులు పట్టవచ్చితిమి యారసి మామొఱలాలకింపవే॥౧౨౯॥ క॥ కాల్చిరిజన్నపుసాలలు। కూల్చిరి దేవళములెల్ల గోడలతోడన్। బీల్చిరి మాసనినెత్తురు । రాల్చిరి యేలికలతలలు రవణంబులతోన్ ॥ ౧౩౦॥ ఉ॥ ఏమనిచెప్పవారమల యారసమప్పొలదిండ్లబారిచే। నేము

ను బోవఁగా వెఱతు మెప్పడు జన్నపుఁబాళ్లకై కొనం । డాముచు గుట్టుమీఱి జడదా
ఱులు మానిరి ముక్కుపట్టఁగన్ । బ్రేముడి బొట్టియల్ విడిచిపెట్టిరి మొజ్జలనూకను
చూడఁగన్ ॥ ౧౮౧ ॥ క ॥ మేమే జేజేదొరలము । మేమే జగములను నెల్ల మిన్నలమను
చున్ । బాములిడం దొరఁకొని రాఁబాఁగులు కడతేర్పుమమ్ము బ్రతికింపఁగదే ॥ ౧౮౨ ॥
క ॥ అని మొక్కి తన్ను వేడిన । వినుసిగరాయఁడు వారి విన్నపమెల్లన్ । విని కనికర
ము దఁబొదలఁగ । గనుఁగొనలం బిన్ననవ్వు గదుర గఁబలికెన్ ॥ ౧౮౩ ॥ క ॥ మీ యుం
డఱి నిజమాడెద । మోమోటలు కట్టిపెట్టి మొఱకులవారన్ । నేమడఁప నూపవెన్నని ।
నేమంబునఁ గానఁబొందుఁ జేకుఱుఁ గోర్కుల్ ॥ ౧౮౪ ॥ క ॥ వెన్నుఁడు దక్కఁగ
నొండొకఁ । డెన్నఁడుఁ గెడపంగఁజాలఁ డీరక్కసులం । దిన్నగ మీరిపుడా తంపుఁడు నెన్నఁడు
కరుగుండు నెమ్మియుల్లముగ డురన్ ॥ ౧౮౫ ॥ క ॥ ఆ వైనవడి మలవిలుతుఁడు । మూఁ
కగఁదను వేను వేలుపులతోనఁగా । నేకడఁగొలిచెడి గాఁవలఁ । జేకొని కాపాడ మీకె
చెల్లునటంచున్ ॥ ౧౮౬ ॥ క ॥ ముక్కంటి నీవడొక్కచి వారొక్కట వెలిగొండవెడలి
యొండొరుఁగనుచున్ । మిక్కిలి పొంగి చెలంగెడి । యక్కడి పాల్కడలిఁ గాంచి యదం
తొకదీవిన్ ॥ ౧౮౭ ॥ క ॥ కడలికిఁదోడవకఁగాఁగదు । బెడగగు నొకవీడు చూచి
యింపుగదానిన్ । దడవబ్బురపడి చూచుచు । నెడనెడఁగల వింతలెల్ల నేర్పడఁదమలోన్ ॥
౧౮౮ ॥ సీ ॥ చెప్పి మెచ్చుచు నొక్కింత సేపు మసలి । యొక్క చక్కని జక్కని చెక్క
డంపుఁ । బనులఁ జెలువొందు పొగడొందు పసిఁడికోటఁ । గనులవిందుగఁ బొడగాంచి కనఁ
దలంచి ॥ ౧౮౯ ॥ గీ ॥ చొచ్చి యచ్చంపు బచ్చల మెచ్చుహెచ్చు । కట్టడపుఁద్రోవ
క్రేవల బిట్టునడిచి । యవల మగఱాల జిగిచాల యలమనలరు । తళుకులీను వెన్నని
నెలవుచేరి ॥ ౧౯౦ ॥ సీ ॥ పొంగారు బంగారు రంగు కంబంబులఁ జలువచప్పరములు
చెలువునింప । హరిమించు సిరిగాంచు హరిగంచునందంపుఁ జందువా మిసమిసల్ చొక
లింప । వగఁ గ్రాలు పగడాల మొగరాల గుంపుల కెంపులుఁ గ్రేవలఁ గ్రేళ్లుదాట । మెఱుఁ
గు నీదారలేని నెఱమానికపుఁ బెద్దగద్దెల నిగ్గులు గంతుమిగుల । వెన్నుఁ బొడగను కడ
కను వేడుకాత । నిలువఁదీఱిక యూరక నెట్టికొనుచు । వెంటఁ దనవారిఁ గొని పాఱు వేల్పు
టేఁడు । వేయు కన్నులు చాలక వెఱఁగుచెందె ॥ ౧౯౧ ॥ చ ॥ జిగిమగఱాల నేలవయిఁ
జెట్టులుఁ బట్టెలుఁ దీర్చి కూర్చి సొంపుగ నమరించినట్టి మనువుత్తడి కంబపుగుంపు మీఁది
పెన్ । బగడపు దూలపుంగములపైఁ దెలిముత్తెపుఁ బాలగచ్చుతో । నిగనిగలాడఁ బోడిమిని
నెట్టనఁ గట్టిన మేడలోపలన్ ॥ ౧౯౨ ॥ క ॥ వెన్నుండుండుట విని చని । క్రన్ననఁ జూడఁ
దలఁచి యానుకాదోయని యం । తన్నిలిచి యొక్క కలికిని । విన్నవ మొనరింపుమనుచు
వేడిరి వేల్పుల్ ॥ ౧౯౩ ॥ వ ॥ అదియునుం జని ॥ ౧౯౪ ॥ సీ ॥ మొనపంటఁగొన యంటి
కొనుమంచుల చ్చికిఁ దెలియాకు మడుపులందిచ్చువాని । నీగందమదె చిందెఁ జేరరమ్మని
నేలగుబ్బెత చెక్కిలి కొట్టువాని । తనుఁ జూచి తత్తవేచి చనవావ్వఁ గనుగీటు నీళతోఁ

జిఱునవ్వు నెఱవువాని । నెవరందో ముఖరందు హెచ్చు కూరిమినాకుఁ జెప్పుకొండని
నవ్వి చెలఁగువానిఁ! బచ్చవిలుపుగ ముచ్చటల్ పలుకువాని । వెన్నుఁగని బ్రహ్మకు వాకిట
వేల్పులెల్ల! సామి నిలుచున్నవారని చనవుకతన। మనవి చేసిన రమ్మనుమనుచు బలికె॥
౧౯౫॥ క॥ అనుదెమ్మని నెలవిచ్చిన । నతిగి సరగను బణిహారు లావేల్పులతో । దొర
వారిట మిము దోడ్కొని । యరుదేరఁగ మమ్ము బుచ్చి రనుచుం దెలుపన్॥ ౧౯౬॥
గీ॥ వారలందఱుఁ జనుదెంచి వగుసతోడ । వెన్నునకుఁ బెక్కు తెఱఁగుల వేఱు వేఱు।
మ్రొక్కులిడి పొగడ్తలు దెసల్ మ్రోయఁజేసి। విన్నవించిరి తమవడ్డ వెతలవెల్ల॥౧౯౭॥
చ॥ పొగరునరక్కసీండ్రదు తగమూవురుఁ బ్రోవుగఁ గూర్చి దాశసైన్। జగములు గాసిచేసె
దరు చావకమానెను మేచపూనుటన్ । మిగులఁగ బ్రంతలన్నుగిలి మీకడకిట్లరుదేర గల్గె
నూ। మొగులడఁగించి ప్రోవఁగదవే యిదె వేడెదమెల్లవారమున్॥ ౧౯౮॥ సీ॥ నెఱ
మగంటిమి మాని నీళ్లమోవఁగలోగి వెలిమైన మలవిల్తు బలిమియెంత । మాఱువేసము
పూని మఱిసీఁ దూరిన పచ్చదుప్పటివాని బలిమియెంత। చుదిమదివోయి పొఁజదువులు
గోల్పడి తలకొట్టబడు తాతబలిమియెంత । గొడవలుపడి కోడికూతకూసి యుట్టి యల
వేల్పురాయని బలిమియెంత । నిదురయున్నది యెన్నఁడు వదలితెగు । లాతతెఱఁగంటి
దంటలచేతబలిమి । యెంచనదియెంతమాకని యించుకైన । లెక్కసేయరు మాటలు
పెక్కులేల॥ ౧౯౯॥ గీ॥ ఏమిచెప్పకొనుదు నునూ సామినీకు। వారుపఱచె నన్నెఱపుల
వనరునప్పు। డెంతొ దోసంబుచేయువా రిట్టివేల్పు। బ్రతుకుఁ జెందుదురనియెంతు పెదల
లోన॥ ౨౦౦॥ గీ॥ ఇచ్చమాని సురలకు జుఱ్ఱుదమిచ్చుటగును। జావుగలిగినవారల చంద
మరసి। యేలోకొ తామగలిగింపఁ జాలఁడయ్యెఁ । జావుమాకని నలువపై నేఱవాడము॥
౨౦౧॥ సీ॥ బెత్తికంబుగాఁ గేల నడిదంబుపూనిన మేటిరక్కసులకుఁ జేటుమాకు।
బిగివింటి నొగినంటి తెగనిండ దీసిన బిగుదు దండుల కేంద్రు వేయునిందుఁ। బులుఁగుతత్తడి
నెక్కి పొలికలనికి నేగ నెవ్వనివారల యసురులేగు । నెదలోనఁ గననూని యించుక
చూచినఁ గావవారల పిండుగండడంగు । బటువుకైదువు తనరారదిటముమీఱ । బంటు
లనగాచు పనిపూని వచ్చితేని । తలఁక కెవ్వాఁడు చివ్వకు నిలుచువాఁడు। జాలపేలను
నైకొమ్ము సరగమన్ను॥ ౨౦౨॥ క॥ అనివిన్నఁదనముతో వఁగ। మనవియొనర్పంగవారి
మన్ననతోడం। గనుఁగొని వెన్నుండిట్లని। కనికరమున నానతిచ్చెఁ గరఁగినమదితోన్॥
౨౦౩॥ చ॥ ఎఱుఁగుదు రక్కసుల్లులువయిచ్చిన మెప్పులనొప్పమీఱి పన్। తెఱఁగుల
మిమ్మునొంచుటయుఁ దీఱని యాఱడి కోర్వలేక యం।దఱు మలవిల్తు గొల్చుటయు
నన్గననాతఁడు మిమ్ముఁబుచ్చుటే। నెఱుఁగుదు వేల్పులార చనుఁడింద్లకు వారల రూపు
మాపెదన్॥ ౨౦౪॥ క॥ అమ్ములవానలు గురియుచు । నెమ్ములువిఱుగంగ మొత్తి యెవ
రద్దయినన్। నమ్ముఁడు జనుకడకనిచెద। నిమ్ములనుండుండు మీరలెల్లరునింకన్॥ ౨౦౫॥
సీ॥ అట్టికరమును గనికరముట్టిపడెడు । వెన్నుపలుకులు వీనులవిందుగొలువ । నెదలఁ

జూదలెడు నుడిలల వదలికదలి। యిమ్ములకు నేగి రిమ్ములనెల్లవారు॥ ౨౦౬॥ గీ॥ అట్లు జేజేలు తమయిండ్ల కరిగినంత। నంతయును వేగరుద్దెల్పనాలకించి మాల్యవంతుండు తమ్ములమంతనమునం। బిలువంగానంపి యొరులకుం దెలియకుండ॥ ౨౦౭॥ గీ॥ తగవు దోపంగ నిట్లనెం దమ్ములార। వినరుగా నేటిప్రొద్దాకవింతవింటి। వెఱచి మొన్ననీనదుము ను వేల్పులేమొ। గట్టువిల్కానియొద్దకు నట్టెయేగి॥ ౨౦౮॥ క॥ కనివేనవేలతెఱంగులం। గనికరమెదంబుట్ట నోటికనితిఱంగా। మనయాగడంబులెల్లను। మనవియొనర్చుచు నటు పయి మముమీబంట్ల౯॥ ౨౦౯॥ క॥ నిలువంగనీయరెంచును। బలియురు రక్కసు లు వారివారికిమమ్ముం। దొలంగించి యేలకుండినం। గలరేయెందైనమాకుగాదిలిచుట్టల్॥ ౨౧౦॥ చ॥ అనిమొఱవెట్టంజొచ్చిరట యాపయినాదలయూచి యాతండు౯। గని కరముప్పతిల్లం గడకంటను గన్గొనివారింగూల్పంగా। వినుండిదెయున్నదూపు వినిపించెద నూపను నేనువెన్నునిం। గనుండతండమ్యనేని మిముంగావంగంజాలినవాండుపోడిమి౯॥ ౨౧౧॥ గీ॥ అనుచునానతియిడెనంటయాపలుకులు। చెవినివేసుకచనిపైడిచేలవానిం। గానంగాంజోయి మ్రొక్కులువేనవేలు। సలిపివిన్నవించిరంటపై చంపుమునసె॥ ౨౧౨॥ మత్తకోకిల॥ అంతటంగటివేల్పువారలయందుం బ్రేముడిమీఱంగా। నెంతకైనను నేను గల్గంగ నేలనెవ్వగమీకికం౯। బ్రుంతురక్కసిపేండ్లముప్పర దొడ్డతూపులబ్రేల్మిడి౯ వంతలేలను బొందు గీములవంకనందఱు నెమ్మితో౯॥ ౨౧౩॥ క॥ అని వీడుకొల్ప। వెల్వడి। కనుసైగలు చేసికొంచుం గైదండలతోం। జెనుసందడినేయుచు వేం। జనిరంట మొదలందు సంతసంబలరార౯॥ ౨౧౪॥ ఉ॥ వేల్పులపాలివాండు కఱివేల్పతండిచ్చిన బాసతప్పనే। తెల్పెదనెట్టులైన ననిందీఱుచువారలపూన్కి యెల్లం దొ। ల్వేల్పులమంచు నెవ్వరిని వీక్కుచులెక్క యొనర్పకక్కటా। సల్పితి మట్టివాని కెకసక్కెమ్ముక్రొవ్విన నం జేటుమూడదే॥ ౨౧౫॥ క॥ తనబలిమి యెదిరిబలిమియుం। గనుంగొనంగాలేక త్రుళ్ళి కావరమున నె।ప్పనివేరము పూనితిమిటు। మనపొగరులె యింతచేసె మఱి యేమిటికి౯॥ ౨౧౬॥

[సశేషము.]